# భాషాపోషక గ్రంథమండలి

అమృతలూరు, సంపాదకుఁడు,

గుంటూరుమండలము. సత్యనారాయణచౌదరి.

ఆంధ్రభాషాపోషకు ససియగు బలుపు నాకాంక్షించి యీ గ్రంథమండలిని వెడలించితిమి. ఏతన్మాలమున, అతివిశాలమగు సంస్కృతవాఙ్మయముపైని పాశ్చాత్య పండితులు వెలయించిన విమర్శనములను ప్రదర్శింతుము. స్మృతులు పురాణములు లోనగు వానిలో విశిష్టము లగువానిని అందఱు కవగాహ మగునటులు తేటతెలుఁగున వివరింతుము. సరసములగు సంస్కృతాంగ్లగ్రంథములను ఆంధ్రబాలుర కుపయుక్తమగు వానిని బయలుపఱతుము. బాలికాబాలకులకు సాహ్యపడు పద్యగద్యకావ్యములను బ్రకటింతుము.

ఆంధ్రలోకపు టాదరాభిమానములను అర్థించుచుంటిమని మనవి.

వ్యాకరణాధ్యయనము సేయు సంస్కృత విద్యార్థులు అనుదినము సంస్మరించు మునిత్రయములో వాక్యకారుఁడగు వరరుచి యొకఁడు. ఇతనినే కాత్యాయనుఁ డనియు నందురు. దివ్యలోకనివాసియగు నీతఁడు మర్త్యలోక మలంకరించి అనితరసాధ్యములగు ననేకకృత్యము లొనర్చినాఁడు. ఈ మహనీయుని శబ్దశాస్త్రప్రావీణ్యమును - లౌకిక వ్యవహార విజ్ఞానమునుగూర్చి సంస్కృతభాషలో నడచిన సరసమగు వచనరచనను అవలంబనముగాఁ గయికొని తెలుఁగున దీనిని గూర్చితిని. భాషాసౌష్ఠవాదికమున అధునాతన పాఠకలోకమునకు అనువగునటులు వెలువడిన యీరచనము విద్యాధికారుల దృష్టిపథమున సంచరింపఁ గలదని ఆశించెదను.

పితృ*పాదుల పాదకమలములకు

సగౌరవ సమర్పితము : సత్యనారాయణ

* కీ. శే. ౧౮. ౫. ౧౯౩౫

# సూచిక

శ్రీః

# వ ర రు చి

## శా ప ము

త్రొల్లి చరాచరగురువగు భవానీపతికి భక్తగణంబగు ప్రమథగణంబునఁ బుష్పదంతుండను నాతఁడుండెను. ఆతఁడు శంకరున కత్యంత ప్రేమపాత్రుఁడు. ఒకనాఁ డాతఁడు సాంబుని సేవింప నరుదెంచి యాసమయంబున లోనికి రావలదని నంది యెంతయు వారించినను వినక, యోగవశమున నలక్షిత స్వరూపుఁడై లోనికిఁజొచ్చె. అత్తఱి నంబికాపతి యచలరాజ కన్యకకు నశ్రుతపూర్వము నత్యద్భుతమునగు విద్యాధర చరిత్రమును మృదుమధురముగ నభివర్ణించుచుండెను. దాని నాపుష్పదంతుఁడు సమగ్రముగ నాలకించి యింటి కరిగి యా కథయంతయు నెంతయుఁ గుతూహలమున గృహిణితో ముచ్చటించెను.

ఆపె పేరు జయ. ఆమె పార్వతికిఁ బ్రతీహారి. తత్కథా శ్రవణమున నాపె యెంతయు విస్మయపడి దానిని యథాశ్రుత

ముగఁ బార్వతిప్రేమాలను వర్ణించెను. అది విని శాంకరి తత్క్షణమ శంకరునితో 'నాథా, తా మ్ముగ్గడించిన చరిత్ర మపూర్వమని యంటిరే! జయయుఁగూడ నది యెఱుంగునే!' యని సకోపముగఁ బలికెను. ఆతఁడును యోగదృష్టిని జరిగినది యెఱింగి, ప్రియా, యా నాఁడు పుష్పదంతుఁడు మన కెఱుక లేకయె యరుదెంచి యియ్యది విని భార్యతోఁ జెప్పియుండెనని ప్రత్యుత్తరమొసంగెను. ఆ క్షణమె యంబిక, 'మానవ సులభమగు కౌతూహలమున ప్రవర్తించెను గావున నాతఁడు మానవ లోక నివాసమునే యనుభవించుఁగాక' యని శపించెను. అటులు శప్తుఁడగు పుష్పదంతుఁడు మధ్యమలోకంబున భారత వర్షమందలి కౌశాంబీనగరమందు వసుదత్తాసోమదత్తులను బ్రాహ్మణదంపతులకుఁ బుత్రుఁడుగ జన్మించెను.

ఆతని శైశవ దశయందే జనకుఁడు పరలోకమునకుఁ జనియె. శోకవిహ్వలయగు జనని ధైర్య మవలంబించి యెట్టెటో బాలకునిఁ బోషించుచు, దారిద్ర్యమున మునింగియున్నను దన యాభ్యుదయ మాకాంక్షించుటఁ జేసి శక్తికొలఁది దేవతారాధ

నములు నతిథిసత్కారములు లోనగు వానిని జరుపుచుఁ గాలము గడపుచుండెను. శోక మెఱుంగని శైశవ మనుభవించు నా బాలకుఁడును శుక్లపక్షసుధాకరునిమాడ్కి దినదినాభ్యుదయ మందుచు, నగరమున నచ్చటచ్చట జరిగెడి సభలకు సంగీతగోష్ఠులకుఁ జేరుచుఁ దాను విన్నదంతయుఁ దల్లికి యథాశక్తిని వినిపించుచు మిక్కిలి గారాబమునఁ బెరుగుచుండెను.

ఒకప్పుడు వ్యాడి - యింద్రదత్తుఁడు నను నిరువురు విప్రులు భూమండలమునఁ దిరుగుచు నా నగరమును జేరి యా రేయి విశ్రమింప నా పేదగృహమునకె వచ్చిరి. సకృదాకర్ణనమున సర్వము మనమునఁ దుంచుకొను నా బాలకునిఁ బరికించి విస్మితులయి, పరీక్షింపవలయునని భావించి ప్రాతిశాఖ్య నొక కొంత నాతనికిఁ జెప్పిరి. చెప్పినదే తడవుగ దాని నాతఁడు వారి కప్పగించెను. బాలకుఁ డేకసంథాగ్రాహి యని వారలు నిశ్చయించి యాతని తల్లియగు వసుదత్తకు నమస్కరించి యిట్లనిరి — 'అమ్మా, యీతఁడు సామాన్య బాలకుఁడు కాఁడు. ఇట్టివానిని వెదుకవలయుననియే యిలా

తలమునఁ దిరుగుచుంటిమి. మా జన్మభూమి వైతసపురి. చిన్ననాఁటనే తల్లిదండ్రుల యెడఁబాటు నొందితిమి. దిక్కెవ్వరును లేరు. పిత్ర్యమగు ధనమూ, వలసినంత కలదు. విద్యా ధనము కావలయునని కాంక్ష కలిగినది. అద్దాన నేకాగ్రమగు తపమున దైవము నారాధించితిమి. అంత రేయి 'నంద పరిపాలితమగు పాటలీపుత్ర మేఁగి యందలి వర్షుఁడను ద్విజునివలన విద్యాలాభము నందుఁ డని కుమారస్వామి యాదేశించినటులు కలగంటిమి. తోడ్తో నాపట్టణమె యరిగితిమి. అరిగి యట్టి మహాపట్టణమున వర్షుఁ డెచ్చోటఁ గానుపించునో యని వ్యాకులపడుచుఁ గాన్పించువారి నడుగుచు వచ్చుచునుండ, వర్షుఁ డను పేరు గలవాఁడు మూర్ఖుఁ డగు బాపఁ డొకఁడు కలఁడని కొందఱివలన వింటిమి. విని యుల్లాసమున నడువ నడువ నొక్కయెడఁ బాడువడ్డ గృహమును బరికించితిమి. అం దెటఁ జూచిన నెలుక కన్నములే. విడివడ్డ గోడలే. అందు సూర్యకిరణములు నిరాతంకముగఁ జొఱఁబడుచుండు. ఆపదల కయ్యది జన్మక్షేత్రమా యనిపించు. అట్టియింట ధ్యానచిత్తుఁడగు వర్షుని నాలోకించితిమి.

ఆతని యంతికమునఁ జినిఁగిన యంబరములను దాల్చి సంస్కారము లేని శరీరముతో రూపెత్తిన దుర్గతివోలె నాతని భార్య కానుపించె. అంత నామెకు సమస్కరించి మా వచ్చిన యుదంత మంతయు వివరించితిమి. ఆమెయు నాదరమున నిటులు వచించినది — 'బిడ్డలారా, యీ పట్టణమున శబరస్వామి యను ద్విజోత్తముఁ డొకండు కలఁడు. మూర్ఖుఁడు దరిద్రుఁడు నగు నీవర్షుఁ డాతని పుత్త్రుఁడే. ఇతనికి బుద్ధిమంతుఁడు ధనవంతుఁడు నగు తమ్ముఁ డొకఁడు కలఁడు. ఉపవర్షుఁ డని యాతని పేరు. ఒకప్పు డీతఁ డొక్కెడ జుగుప్సితమగు దానమును సదక్షిణాకముగఁ గైకొని నాయొద్ద కరుదెంచెను. నేనది యెఱిఁగి బహువిధముల నిందించితిని. అంత నిర్వేదము నొంది నిశ్చలమగు తపముతో నీతఁడు స్వామికుమారుని సంతోషపెట్టి సకల విద్యలు నాతని యనుగ్రహమున సంపాదించెను. కాని, యేకసంథాగ్రాహియగు బాలకు నొకనిఁ జేరఁదీసి యీవిద్యలు ప్రకాశింపఁ జేయుమని దైవాజ్ఞ కలదు. అట్టివాఁ డెచ్చోటను గన్పట్టకపోవుటను రేయుం బవలిట్లు జపించుచు ధ్యానించుచుఁ గూరుచున్నాఁడు. కావున నట్టివాని

నెందైన నన్వేషింపుచుఁ. నావిని మేము వారి లేబరమునకు గాసిచెంది వారికిఁ బెక్కు సువర్ణములొసంగి యటనుండి వెడలితిమి. భూతలమంతయుఁ జుట్టివచ్చితిమి. ఎచ్చోటనుగాని యట్టిబాలకుఁడు కానుపింపఁడయ్యె. హృదయవేదన వొందితిమి. దైవానుగ్రహమున నేఁటికిచ్చోట నట్టిబాలకునే పరికింపఁ గలిగితిమి. విద్యావ్యాప్తికై యీతనిని విడనాడము.

అన విని వసుదత్త వత్తెయని యాదరముగ నిటులు పలికెను— 'ఈతఁడు జనించినపుడె యిట్టి బుద్ధిమంతుఁడగు ననియు వర్షునివలన విద్య బడయుననియు లోకమున శబ్దశాస్త్రమునకు స్థిరప్రతిష్ఠ చేకూర్చుననియుఁ బేరు వరరుచి యనియు నశరీరయగు సరస్వతి వచించినది. దాని కనుగుణముగ మీరరుదెంచితిరని తోఁచుచున్నది'. అని యనంతమగు సంతసమునఁ దనయుని వారి కర్పించెను.

## వి ద్యా భ్యా స ము

వ్యాడి యాపిన్న వానిని గైకొని గొప్పయుత్సవమును గావించి, యధికమగు ధనమును వసుదత్తకొసంగి యుద్బాప్ప యగు నామెవలన ననుజ్ఞఁబడసి యింద్రదత్తునితోడఁ బాటలీ పుత్త్రి మరిగెను. అరిగి యట వర్షోపాధ్యాయునిల్లుచేరి 'యిదుగో! అట్టి బాలకుఁడని వానికిఁ జూపెను. వర్షుఁడును హర్షనిర్భర మానసుఁడయి గాఢానురాగమున రారమ్ము బాలకా యని చేరఁదీసి కౌఁగిలించుకొని యాలసింపక పవిత్రమగు స్థండిలమున బాలకునిఁ గూరుచుండఁజేసి ప్రసన్నమై గంభీరమై దివ్యమై యొప్పు వాణితో నోంకారోచ్చారణ పూర్వకముగ వేదము లను సాంగముగ నధ్యాపింప నారంభించెను. ఒకతూరి విన్నం తనే వరరుచియు, రెండుతూరులకు వ్యాడియు, మూఁడుతూరు లకు నింద్రదత్తుఁడును గుఱుతింప సాగిరి. ఎన్నఁడు విని యెఱుం గని మహాద్భుతమగు ధ్వని, యాపాదువద్ద గేహమునుండి ప్రచండముగ వెడలుటఁజేసి పౌరులెల్లరు విస్మయమున హర్ష మున మునింగి వర్షోపాధ్యాయుని మాహాత్మ్యము నెల్లయెడలఁ గొండాడుచు నగరమంతట మహోత్సవము గావించిరి. నరపతి

యగు నందుఁడును, కుమారస్వామి ప్రసాదమునఁజేసి ప్రాప్తిం చిన విచిత్రమగు వాణీవిలాసమును గుఱించి యబ్బురపడి వర్షునియింట ధనవర్షము గురియించెను.

ఇట్టులు కొన్నినాళ్లు గడువను గురుకుల వాసియగు వరరుచి యతిక్రాంతశైశవుఁడయి విద్యాపారంగతుఁడయ్యె.

పిదప నొకప్పుడాతఁడు వ్యాడీంద్ర దత్తులతోఁ గూడ నింద్రోత్సవము విలోకింప వెడలి, యొక్కయెడ సర్వాభరణ భూషితయయి కాముని వైజయంతివోలెఁ జరించుదాని; పేశలా కారమున రూపెత్తిన లక్ష్మివోలె నొప్పెడు దాని; సఖీపరివృత యయి విస్రంభాలాపనులు ముచ్చటించుదాని నదృష్ట పూర్వ యగు, నొక్కకన్నియను విలోకించెను. విలోకించిన మాత్రాన నామె యాతని హృదయమునఁ జొచ్చెను. వరరుచియు శూన్య హృదయుఁడయి యామెనే స్మరించుచు, 'మిత్రుఁడా, కమనీయా కృతి కల యీ కన్నియ యెవతెయై యుండనోపు! నా హృద యమును ప్రముచ్చిలి వెడలుచున్నది.' అని యింద్రదత్తుని పృచ్ఛిం చెను. నగర వృత్తాంత మెఱింగిన యాతఁడిట్లు బదులువలికె—

'సఖుఁడా, యీమె మన యుపాధ్యాయుని యనుజుఁడగు నుపవర్షుని కూఁతురు. అశేషరమణీ మండలమున నగ్రగణ్యగా వెలయుచున్నది.' నావిని యానాఁడు వరరుచి తక్కిన పనులను దలంపక మూగవోలె జడునిమాడ్కి బధిరునిభంగి నంధుని చందమున సంచరించుచు నామెనే తలపోయుచు జీవలోకమును సర్వమును దన్మయముగాఁ దలంచుచు నిదుర యెఱుంగక యారేయి యట్టులే గడపుచుండెను.

మూఁడు యామములు ముగిసినవి. అంత నాతని కొకింత నిద్దుర పట్టెను. అందు ధవళవస్త్రధారిణి యగు దివ్యయువతి యొకర్తుక కానుపించినటులు కల కాంచెను. ఆపె యాతని నూఱడించి, 'పుత్త్రకా, యేను నీశరీరమునఁ గాపురమున్న సరస్వతి నని యెఱుంగుము. నీ మనోరథమునకు లక్ష్యభూతయగు నా కన్నియ నీదు పూర్వభార్యయే సుమీ! ఆమెపేరు ఉపకోశ. ఈ పుట్టువునను నిన్నే కోరుచున్నయది. తక్కినవారిని దలంపదు, చింతింపవలదు'. అని యెఱింగించుచునే యంతర్ధానమందెను. వరరుచి మేలుకని తోడ్తోన దయితా మందిరమునకు దగ్గర నున్న చూత వృక్షము క్రిందికి నేఁగెను.

అట నాతనిం గాంచి యుపకోశాసఖులు పలుకరించిరి. లోనికి రమ్మని మఱిమఱియుం బిలిచిరి. తనకోసమయి యమ్మానిని యనంగవేదన ననుభవించుచున్నదని యాతం డెఱిం గినాఁడు. కాని పెద్దలొప్పుకోని కులకన్యకను జేపట్టుట యాతం డభినందింపఁడయ్యె. యశస్వామియగు వివేకికి నట్టి సాహసము కన్న మరణమే మేలని యాతని తలంపు.

ఇట్టులు కొన్నినాళ్లు గడచినవి. నానాఁటికి శూన్య హృదయై క్రుక్కిపోయెడి యుపకోశను దల్లి యవలోకించి వృత్తాంత మెఱింగి వల్లభునకుఁజెప్పె. ఆతఁడును వర్షున కెఱింగించె. అందఱు నానందపడిరి. వివాహము నిశ్చితమయ్యె. తత్క్షణమ వ్యాడి కౌశాంబి కరిగి వసుదత్త కెఱింగించి యామెతో విచ్చేసెను. అంత శుభముహూర్తమున వరరుచి యుపకోశను వహ్నిసాక్షికముగఁ బెండ్లాడెను. ఆదంపతులును దల్లియు నా నగరమందే వసింపసాగిరి.

ఇట వర్షోపాధ్యాయుని కీర్తిలత దశదిశలు పెనఁగొనఁ జొచ్చెను. నానాఁటికి శిష్యసంపత్తి పెంపుకాసాగె. అందు

గొప్ప మందమతి యగు మాణవకుఁ డొకండు కలఁడు. వానిపేరు పాణిని. గురుశుశ్రూషల వలనను సహాధ్యాయుల యపహాస్యముల మూలమునను జివికి పోవుచున్న పాణినిం గాంచి యుపాధ్యాయుని భార్య యిటులు వలికె — 'నాయనా, యెంకులకోయి యీ శ్రమ? దేవతానుగ్రహము పొందనిచో విద్య నీకలవడుట దుస్సాధము. కావునఁ బొమ్ము. భవానీపతి నారాధింపుము'. అని.

నిర్విణ్ణుఁడగు పాణిని యందుల కెంతయు ముదంబంది తోడనె హిమాలయమున కరిగి తీవ్రతపమున నీశాను నుపాసించెను. పురారాతియుఁ బరితుష్టుఁడయి యాతనికి నవ్య వ్యాకరణ మొకటి యొసంగెను. అది యంది పాణిని పాటలీపుత్ర మరుదెంచి వాదముకోసమయి వరరుచినే యాహ్వానించెను. అయ్యిరువురకేడు నాళ్ళవిచ్ఛిన్నముగ వాదము చెలరేగెను. అష్టమ దినమునఁ బాణినిని వరరుచి యోడించె. అంత నంబరతలస్థితుఁడగు శంభుఁడు ఘోరమగు హుంకారమొనర్చె. తోడ్తో నింద్రవ్యాకరణము భూతలమున నశించెను.

వరరుచి లోనగు వారెల్లరు పాణినివలన నోటమి నంది మూర్ఖు లయిరి. ఆకస్మికముగ సంభవించిన యత్యాహితమున కెంతయు వరరుచి నొచ్చుకొని తానార్జించిన సర్వస్వము హిరణ్యగుప్తుఁడను వణిజుని వద్ద నిల్లడఁబెట్టి యది భార్య కెఱింగించి యాపె యొప్పుదల నొంది శంకరు నారాధింపఁ దుషారాద్రి కేఁగెను.

ఉగ్రతపశ్చర్యకై యిలు వెడలిన వల్లభునకు సర్వథా శుభముల నాకాంక్షించు నుపకోశ పాతివ్రత్య ధర్మములను నెఱపుచుఁ బ్రత్యహము భాగీరథి నీట మునుఁగుచు నియతవ్రతయయి యిలువేల్పులకు మ్రొక్కులిడుచుండెను. ఒకప్పుడామె, భాగీరథీ తీరమున నుండు తఱిని యాదృచ్ఛికముగ రాజపురోహితునకు దండాధిపతికి మంత్రికుమారునకుఁ గాన్పించెను. ప్రతిపచ్చంద్రలేఖ వోలెఁ బ్రజాలోచన హారిణియగు నామెం జూచినదే తడవుగ నాముువ్వుర మనసు కలఁత చెందెను. పిదప స్నానమొనర్చి యరుదెంచుచున్న యాసాధ్విని మార్గమధ్యమున మంత్రికుమారుఁ డాకస్మికముగ నడ్డగించెను. దిక్కెవరును లేని యాతరుణి యాత్మరక్షణమున వేఱొద్ది యుపాయముం గానక సమయోచితమగు ప్రతిభతో నిట్లు పలికె— 'అయ్యా, యేను దొడ్డకులమునఁ బుట్టినదానను. నాదుభర్త ప్రవాసమున నున్నాఁడు. బలవంతమున కియ్యది తగ్గ కాలమూ కాదు; దేశమూ కాదు. రేపెల్ల పౌరలోకము మధూత్సవమునఁ

దగిలియుండును. రేపటిరేయి తొలిజామున నాయింటికి రమ్ము'. నావిని యాతఁడు వల్లెయని విడిచిపోయెను. అంతఁ గొంతదవ్వు సనువగా నంతలోఁ గామార్తుఁడగు పురోహితుఁడు నడ్డువచ్చెను. ఆతనికిని మఱునాఁటిరేయి రెండవ జామున గడువుగా నుడివి పతినే మనమున ధ్యానించుచు నడచుచుండ దండాధిపతి యెదురయ్యె. ఆతనికి మూఁడవ జాముని సంకేత మొసఁగి యెట్టెట్టులో వారి చెఱను విడిపించుకొని తన భాగధేయమును నిందించుచు నిల్లు చేరెను.

చేరి యటఁ బెల్లుగ దురపిల్లి 'దైవమా, నన్నేల యీ ధూర్తుల పాలఁ బడవైచితివి? కాయము ఛిన్నభిన్నమైనను శ్రేయమేకాని చరిత్ర భంగము కానిత్తువా? పతి, ప్రవాసమందుండఁ గులయువతులకు మరణమే మేలందురు. ఏమి యొనర్తు' ననుచు నేడ్వసాగెను. అంతఁ జెలులామె నూఱడించి 'యమ్మా, వారిని రానిమ్ము. తమ దౌష్ట్యమునకుఁ దగ్గ ఫలము తప్పక యనుభవింతురులే' యని పలికిరి. ఆనాఁడట్టులే యాసాధ్వి మాటిమాటికి దురపిల్లుచు నిరాహారయై భర్తృగుణములనె కీర్తించుచు రేయి గడపినది

ఉదయము, బ్రాహ్మణ పూజ లొనర్పఁదలంచి కొంత సొమ్ము తెచ్చుటకయి చేటిక నొకతెను హిరణ్యగుప్తుని కడకుఁ బంపెను. వాఁడును స్వయ మరుదెంచి 'తరుణీ, నీ వీఁకనన్నుఁ బ్రేమింపుము. కాదంటివా! యసాక్షికమగు మీ సొమ్ము మీకు దక్కదు.' అని సిగ్గు వోనాడి నుడివెను. పిడుగడఁచిన వడువునఁ బెల్లుగఁ గంపిల్లుచు నితిక ర్తవ్యతామూఢయై క్షణ కాలముండి, మనమున నెంతయు వగచి యాతనికిఁ గూడ నాఁడేయి నాలవ జామని సంకేత మొసర్చి పంపెను.

ఆసాధ్వికిఁ గలిగిన యిడుమపాటు లీఁకఁ జూడఁజాల నని తలంచి గాఁబోలు భానుఁ డస్తాచల ప్రాంతమునకుఁ బరుగిడెను. కష్టదశ యిట్టులె కొన్నినాళ్ళు చుట్టుముట్టు నని సూచించుటకో యనఁ గ్రమమునఁ జిమ్మచీఁకటి యెల్ల యెడలఁ గ్రమ్మివైచె. సంకేతయామము చనుదెంచు చున్నయది. కర్తవ్యమునఁ జేటికలు తెలివితేటలు చూపిరి. కస్తూరికాదులను దైలమునఁ బోసి కావలసినంతవఱకుఁ గాటుకతోఁ గలిపియుంచిరి. వస్త్రములకుఁ గొన్నింటి కా కాటుక

పూఁత లిడిరి. నట్టింటఁ బెద్ద పెట్టె నొకటి యేర్పఱచిరి. అంతయు సిద్ధమయినది. ఇఁక నా దుర్వినీతు లరుదెంచుటయే తడవు.

తొట్టతొలుత ననువగు వేషమును వైచికొని యమాత్య పుత్త్రుఁ డాయింట నడుగు వెట్టెను. చేటికలు గాటముగ నాదరించి, 'అయ్యా, యస్నాతుఁడవగు నిన్ను మా యజమానురాలంటుకొన' దని పలికిరి. వాఁడును నభ్యంతరమేమని యనుచు వారితో గృహాభ్యంతరమున కరిగి, యంధకారమయమగు నచ్చోట గుట్టుగ గుడ్డలు సొమ్ములు నుంచి వారొసఁగిన వలువలు దాల్చెను. ఇఁకఁ జెలులెల్లరు గుమిగూడి తాము సిద్ధముగా నుంచిన తైలమును దెచ్చి యాపాదమస్తక మాతని యంగములకుఁ బట్టించిరి. తాను ధన్యుఁడ నని యాతఁడు తలంచుచు నంధకారమున నభ్యంగ సౌఖ్యము ననుభవించుచుఁ గోరిక లీరిక లెత్తుచుండఁ దొలిజాము గడచి పోవుటయు నెఱుంగఁడయ్యె. ఇంతలోఁ బురోహితుఁ డరుదేరఁ జెలులు ససంభ్రమముగ 'నయ్యా, వరరుచి మిత్త్రుఁడగు పురోహితుఁడిదె

యాకస్మికముగ నరుదెంచినాఁడు. ఏమిచేయుదుము. అంద నుక నిట నొకముహూర్తముండుము.' అని పలుకుచుఁ బెట్టె లోఁప కాతనిఁ బంపి వెలుపలితాళము వైచిరి. ఇఁకఁ బురో హితునిఁగూడ నట్టులే మోసపెట్టి స్నానము వంకతో నయ్యవి యెల్లను జరిపి దండాధిపతివచ్చు సమయమునకుఁ బెట్టెలోనికిఁ ద్రోసిరి. మూఁడవ మూర్ఖుఁడుగూడ నవియెల్ల రుచిచూచుచు వణిజుఁడువచ్చు సమయమునఁ బెట్టెలోనికిఁ జొఱఁబడెను. ఇట్లు లానరాధములు మూవురు నంధతామిస్ర వాసము నభ్యసించువారివోలెఁ బెట్టెయందొండొరు లెడము లేని వారయ్యు భయమున సిగ్గునఁ బరస్పరము మాట్లాడరైరి.

తన భాగధేయమును నిందించుకొనుచు సాధ్వియగు నుపకోశ యెట్టెట్టులో దిటవుపూని, మోమువంచి యరుదెంచి యెట్టయెదుటి వణిజునితో నాథన మిమ్మని పలికెను. అట్లులే యిత్తునని యాతఁడును మాఱువలుక నామె పెట్టెవంకకుఁ దిరిగి గృహదేవతలారా, హిరణ్యగుప్తుని మాటను వినుఁడు వినుఁడని వచించెను.

అంత వణిజుఁడును వారివోలె నభ్యంగన మాచరించెను. తోడ్తోనఁ జెలు లొక్కరీతిని ధూర్తాగ్రేసర, తెల్లవారనున్నది; యిఁక నీఁటికిఁ దరలి పొమ్మని గెంటివైచిరి. ఆ జాల్ముఁడును బోవలేక పోవలేక యుస్సురనుచు నడువసాగెను. కాటుకపూఁత గల యాతని కాయమును నంగవస్త్రమును గాంచిన కుక్కలాతని వెంటఁబడి కఱువసాగెను. ఎట్టెట్టులో సిగ్గుచేటునఁ దొందరపాటున నిల్లుచేరె. కాని పాప మాకాటుకను గడిగి వైచెడి భృత్యుల యెదుటను గాలు కుదిరి నిలువ నోపఁడయ్యెను.

పిదప నా సాధ్వి యుపకోశ చెలికత్తెలతో నందభూపతి యింటికరిగి 'దేవ, హిరణ్యగుప్తుఁడను శ్రేష్ఠి నా నాథుఁడు దాఁచి యుంచిన సొమ్మును మ్రింగఁ జూచుచున్నాఁ' డని విన్నవించుకొనెను. తత్క్షణమే రాజా వణిజుని రావించి విచారించెను. వాఁడును దనయొద్ద వీరిసొమ్ము రవ్వంతయు లేదని యొట్టువెట్టుకొని పలికెను. అంత నుపకోశ — 'దేవ, పెట్టెలో నాభర్త యుంచిన గృహదేవతలే యిందులకు సాక్షులు. వారి

యెట్ల యెదుటనే యీతఁ డక్షరాల న్యాసమగు సొమ్ము నొప్పుకొనియె. అదియు లెస్సఁగ విచారింపుఁడు' అని గట్టిగఁ బలికెను. నావుడు ఱేఁడు విస్మయావిష్టుఁ డయి భటులతో నా మంజూషను సభాతలమునకుఁ దెప్పించెను. అంత నాసాధ్వి 'ఓ దేవతలారా, మున్నితఁడు చెప్పిన దానినే సత్యముగఁ బలుకుఁడు. పిదప మీ గృహమునకుఁ బొండు' అని యెలుఁగెత్తి పలికెను. సభారంగమున గట్టు బయటఁ బెట్టఁబడినను జంకు గొంకుతో వణఁకుచు 'మా సమక్షమం దీతఁ డా సొమ్ము నొప్పుకొనియేయున్నాఁడ'ని వచించిరి. అంత మాఱువల్కక వణిక్కు సొమ్మంతయు నాపె కిచ్చివైచెను.

అపుడు ఱేఁ డామెను సత్కరించి యామె యనుమతిఁ గైకొని యామంజూషను దెరపించెను. తోడనే యా మువ్వురు పురుషాధములు తమఃపిండములువోలె వెలుపలికి వచ్చిరి. అరయ నరయ వారి వైఖరి ప్రస్ఫుటమయ్యె. ఎల్లరు బిట్టుగ నపహసించిరి. ఇదేమని ధార్మికుఁడగు ఱేఁ డడుగ నుదంతమంతయు నాసాధ్వి యెల్లరకు వినిపించె. కులాంగనల చరిత్ర

మచింత్యముగదా యని సభాసదులెల్ల రబ్బురపడియభినందించిరి. క్రుద్ధుఁడై తేఁడు పరదారాద్వేషిణులగు నా పాపులు నల్వురయు సర్వస్వము తీసికొని వారిని దేశమునుండి తఱిమించెను. చండాలు రవలన సయితము ధిక్కారములంది తమపై తమకే యేవగింపు కలుగుటను గడకు వా రసువులు విడనాడిరి. ఉపకోశయు ధార్మి కుఁడగు నాతేనియొద్ద సత్కారములంది, వృత్తాంత మెఱింగిన వర్షోపవర్షులచే మన్ననలు పొంది, యెల్లరు పౌరులు పాతివ్రత్య దేవతయని పరిపరిభంగుల నగ్గించి యర్చించుచునుండ– భర్తనే యనారతమ్ము స్మరించుచుఁ దనయింట నెట్టులో కాలము గడపు చుండెను.

## తపః ఫలము

చిరకాలమునకు వరరుచి తీవ్రతపశ్చరణమునఁ జేసి యంబికాపతి యనుగ్రహ మంది పాణినీయవ్యాకరణమును సమగ్రముగ సరహస్యమునఁ బొందెను. శంకరుని యానతి వలన నీతఁడా శాస్త్రమునే పూరించుటయు సంస్కరించుటయు సంభవించెను. ఇట్లు లాభవుని యనుగ్రహమునఁ బ్రాప్తలాభుఁడై యాతఁడు నిర్భరానంద హృదయుఁడై నవనవోన్మిషద్భారతీ విలాసుఁడై యధ్వపరిశ్రమము లెక్కగొనక కొన్నినాళ్లలోఁ బాటలీపుత్ర మరుదెంచెను. తనరాకఁ గాంచి యభినందించెడి తల్లికి గురువునకు సాష్టాంగపడెను. క్రమముగ నత్యద్భుతమగు నుపకోశావృత్తాంతము నాలకించెను. నివ్వెఱపడియె. ధర్మపత్ని యొనర్చిన గార్హస్థ్య ధర్మమున కెంతయు నానందము విస్మయము నందె.

పిదప వర్షోపాధ్యాయుఁడు కార్తికేయుని యనుగ్రహమునఁ జేసి నవ్యమగు శబ్దశాస్త్ర మంతయు వరరుచి ముఖ

మునఁ దెలిసికొనెను. వ్యాడీంద్రదత్తులును వర్షోపాధ్యాయుని వలనఁ బాణినీయాదిక మంతయు నెఱింగిరి. అపుడు వారిరువురు పరితుష్టులయి గురుదక్షిణను గోరుకొండని వర్షునిఁ బ్రార్థించిరి. కోటి స్వర్ణములు గురుదక్షిణ యని గురువు నిర్ణయించెను. వల్లెయని వారిర్వురు వెడలి లెస్సఁగ నాలోచించి వరరుచిని బిలిచి యిట్లులు పలికిరి.—'మిత్రమా, మన యుపాధ్యాయుఁడు స్వర్ణకోటి దక్షిణము నేరుపరచినాఁడు. ఇంత బంగారు నందభూపతియొద్దఁ దక్క నెక్కడను జిక్కనేరదు. ఆఁతడు తొంబది తొమ్మిది కోటుల కధినాయకుఁడు. నీభార్య ధర్మపత్నియని యాతఁడు మున్నె యాదరించినాఁడు. నీవాతని యర్థింతువా నీగుణములనుబట్టి తప్పక యంతయు నిచ్చితీరును. ఆతఁ డిపుడయోధ్య యందున్నాఁడు. రమ్ము; అటకే పోదము.' వెంటనె యా మువ్వురు సబ్రహ్మచారులు సాకేతమునకుఁ జనిరి కాని, పాప మటకుఁ జేరిరో లేదో నందుఁడు పరలోక మరిగెను. రాష్ట్ర మంతటను గొప్ప సంక్షోభము చెలరేగెను.

అంత నా ముప్పురు చింతావ్యాకులమున నితికర్తవ్య మెఱుఁగకైరి. కొంత తడవునకు, యోగసిద్ధి కల యింద్రదత్తుఁడిటు లనియె — 'మిత్రులారా, నా కిపు డొక్క యుపాయంబు తోఁచెడిని. ఏను నందుని శరీరమును యోగమహిమను బ్రవేశింతును. వరరుచి విచ్చేసి బంగారు కోరవచ్చును. నేను దిఱుగ వచ్చునందాఁక నా శరీరము నీ పాడుదేవళమున వ్యాడి కాపాడుచుండవలెను.' నావిని యయ్యిరువు రేకగ్రీవముగ సెబాసని యనుమతించిరి.

ఇట నందుఁడు దివంగతుఁ డగుడు నంతట హాహారవములు మేరమీఱె. 'అయ్యో! చచ్చితిమి! ఇంకేమున్నది! దైనమా యిదేమి! అనాథల మైతిమే! నందా! నిఖిలలోక లోచనానంద! నీవు లేని జీవితము జీవితమే! నినుఁజూడని కన్నులు కన్నులే! జగమంతయు జీర్ణారణ్యము. ధర్మసేతువు తెగినది. వసుంధర విధవ యయ్యె. విబుధులు నిరాశ్రయులు. సరస్వతి నిరవలంబ. లోకము నిరుత్సవము. దుర్వినీతులు స్వైరవిహారులు. సత్కథ లస్తమించినవి. మేమేమి చేసెదము! మాకేది దిక్కు!' అని పరిపరి భంగుల నంతఃపురాంగన లాక్రందనము లొనర్పసాగిరి. శకటాల ప్రముఖులగు ముఖ్యసచివు లట్టి మహిలాజనము నూఱడించుచు, ఆతని కళేబరము చుట్టుఁ జేరి శోకింపఁ జొచ్చిరి. ప్రధానామాత్యుఁడగు శకటాలుఁ డపారమగు శోకమును సైపఁజాలక, 'మహారాజ, యేమిట్లొనర్చితివి? మమ్ముల నెల్లర నాకులపఱచి, తపమున లభించిన బాలకుఁడగు చంద్రగుప్తునిఁ బరిపంథుల కామి

ష మొనర్చి త్వదేకశరణలగు తరుణీ మణుల మాట తలంపక యీలోకమును విడనాడితివే.' అనుచు దురపిల్లుచునే సూక్ష్మ దృష్టిని జేసిం బరికించుచు నాతని మొగమునఁ జెమటనగవు పొడఁగాంచి, యిదేమా యని యబ్బురపడి యాతని శిరము నంటుకొనియె. అంత నిదురనుండి మేలుకాంచి నటులు నందుఁడు కన్నులు తెఱచి, 'యెంకాల కీకోలాహలము. నేను మృతినొంద లేదు. నూఱేండ్లు బ్రతుకఁ గలను.' అని మెల్లమెల్లగఁ బలుక సాగెను.

'ప్రజల పున్నెముచే నందుఁడు బ్రతికినాఁడు. ఎవఁడో సిద్ధుఁడు మహారాజును బ్రతికించెను.' అని యంతట ననుచరవర్గ మానందహృదయమై యనుచుండ; నమాత్య మండలము ప్రమోదము నొందుచుండ; నవరోధజన మద్భుతానంద మనుభవింప; నాసన్న సేవకులు సంతోసమున గంతులు వేయ; వందిలోక మెల్లయెడల జయశబ్దమున గింగురుపఱుప ధన్వంతరి ప్రోక్తమగు ధాతు విజ్ఞాన ప్రకారము లభ్యసించియు వ్యర్థ మయ్యెనని వైద్యబృందంబు తలంప; మంగళ భేరీపటహ ధ్వనులు

దిక్కులు పిక్కటిల్ల;—వేత్రపాణియగు ప్రతిహారి వేగిరముగఁ బరుగిడి వచ్చి తేని కిట్లులు విన్నవించెను— 'మహారాజ, యఖిలశాస్త్రపారంగతుఁడగు బ్రాహ్మణోత్తముఁడఁట. పేరు వరరుచి యఁట. పాటలీపుత్రమునుండి దేవరవారిని దర్శింపఁగోరి వచ్చి వాకిట నున్నాఁడు.' నావిని సంతసము శయ్యనుండి లేచి సత్వరముగ రావింపుమని యాదేశించెను.

అంతఁ గంచుకు లిడెయిదె యనిత్రోవసూప సభ్యంతర మున కా వరరుచి యరుదెంచి తేనితో నిట్టులు విన్నవించె— 'మహారాజ, కార్యార్థినై వచ్చితిని. భవత్పుత్త్రుజ్జీవనమున గొప్ప యుత్సవము జరుగుచున్నయది. ఇట్టి యభ్యుదయ కాలమున గురుదక్షిణ కోసమయి నాకు సువర్ణకోటి నిప్పింపుము. నావిని యోగనందుఁ డట్టులే యని పలికి యాతనికి సువర్ణకోటి నొసంగుమని ప్రధాన సచివుఁడగు శకటాలు నాజ్ఞాపించెను.

మేధావియగు శకటాలుఁడు చిత్తమని పలికి, 'యిదేమి యిటులైనది? ఇయ్యది కడు విచిత్రము. మృతుఁడగు నీతఁడు బ్రతికినాఁడు. అర్థియు నిప్పుడె వచ్చె. వచ్చి సువర్ణకోటిని

యాచించె. ఆతఁడును విచారింపకయ యడిగినది యిమ్మని యాజ్ఞాపించె. బహుశః యీతఁడు మన నందుఁడు కాఁడేమో! యోగనందుఁడయి యుండవచ్చు. కాని చూతము. ఏది యెటులున్నను నందుని నందనుఁడు పసివాఁడు. రాజ్యమా బహు శత్రుకము. చారులచే వెదకించి సర్వశవములను దహింపఁ జేసెదను. పిదప నీయోగనందుఁడే చిరకాలముండు' నని లెస్సఁగ విమర్శించి యటు లొనర్పఁ జారుల కాజ్ఞాపించెను. తోడ్తోన చారు లెల్లయెడలఁ గలయ. వెదకి కోవెలయందు గూఢముగా నున్న యింద్రదత్త కళేబరమును బట్టుకొని, 'అబ్రహ్మణ్య' మని యాక్రోశించు వ్యాడిని దూలపరించి బలవంతమున దహింపఁజేసిరి.

సువర్ణకోటి నిచ్చితివా యిచ్చితివా యని యోగనందుఁడు మంత్రిపుంగవుని మాటి మాటికి హెచ్చరింపసాగె. ఆతఁడును 'దేవ, పరిజనమంతయుఁ బరమోత్సాహమున మహోత్సవమున మునిఁగియున్నది. రవ్వంత సేపాతని వేచియుండ నిండు, వెంటనే యిత్తుము' అని పలుకుచుఁ గొంతకాలము జరిపెను.

అంత నాకస్మికముగ నబ్రహ్మణ్య ముద్ఘోషించుచు వ్యాడి యరుదెంచి యొక్కపెట్టున నిట్టు లాక్రోశించెను—'రాజా, రాజపురుషులు యోగస్థితుఁడగు ద్విజుని బట్టుకొని ప్రాణము పోయినదని తలంచి నన్ను దులపరించి యనాథ ప్రేతమునుబోలె బలాత్కారమున దహింపఁజేసిరి.'

దాని విని శకటాలుఁడు వెనువెంటనె వరరుచికి సువర్ణకోటి నిప్పించెను.

అంతట యోగనందుఁడు శోకాంతరంగుఁడయి యేకాంతమున వ్యాడితో 'మిత్రమా, పంక్తిపావనులు సోమపీథులు నగు శ్రోత్రియుల వంశమున జన్మించిన యేను—ఈపుట్టువున నె శూద్రుఁడనైతి. స్థిరమైనను సిరియెందులకిఁక?' యని వాపోయెను. వ్యాడి వాని నూఱడించుచుఁ గాలోచితముగ నిటులు వచించె—'సఖుఁడా, శకటాలుఁడు నిన్ను గుఱుతించినాఁడు. మహామతియగు నీయమాత్యుఁడు పూర్వనందుని పుత్రుఁడగు చంద్రగుప్తునియందు స్థిరానురాగము చూపుచుండును. ఎప్పుడో నిన్నుఁ జంపితీరును. కావున నప్రమత్తుఁడవయి

విషాదమును విడనాడి ప్రధాన సచివోద్యోగమును వరరుచి కిమ్ము. నేను వెంటనే పాటలీపుత్రమేఁగి గురుదక్షిణము సమర్పించి వర్షోపాధ్యాయుని మనోరథము పూరింతును' అని.

ఆతఁడు బోధించినట్టులె వెంటనె వరరుచియే ప్రధానసచివుఁడయ్యె. ఒకనాఁ డేకాంతమున వరరుచి 'రాజా, శకటాలుఁ డుద్యోగమున నుండునేని రాజ్యము స్థిరము కాఁజాలదు. కావున నీతనిఁ బరిమార్ప నాలోచింపుము'. అని విన్నవించె. యోగనందుఁడును సమ్మతించి, 'యోగనందున్న ద్విజు నీతఁడు దహింపఁ జేసె' నని దోష ముద్ఘాటించి శకటాలునిం బుత్రశతముతో నంధకూపమునఁ ద్రోయించెను. సపుత్రుఁడగు నాతని దేహయాత్రకోసమయి నీటితోపాటు పిండిముద్ద యొకటి యంత ర్బిలమున ననుదినము వేయించు చుండెను.

ఇట్టు లతర్కితముగఁ జుట్టుముట్టిన యాపదలకై చింతించి శకటాలుఁడు బిడ్డలతో—'పుత్త్రులారా, నీటఁ గలిసిన యీతిండి యొక్కనికి సయితము చాలదు. కావున మనలో నెవ్వఁడు యోగనందునకుఁ బ్రతిక్రియ యొనర్పఁ జాలియుండునో యాతఁడే యీతిండితో బ్రతుకవచ్చు'నని పలికెను. అది విని వారు 'తండ్రీ, నీవే చాలినవాఁడవు; మేము బ్రతికియుఁ బ్రయోజన మేమి'యని పలుకుచు నాతఁడు చూచుచుండఁగనె ప్రాణములను బాసిరి. ధీరులకు శత్రుప్రతిక్రియ యన్నఁ బ్రాణములకన్నఁ బ్రియము కదా!

ఆ కొలఁది తిండితో నాయమాత్యశేఖరుఁడు దేహము నిలఁబెట్టుకొనుచు, 'లోకమున నెవ్వఁడేని యాత్మాభ్యుదయ మభిలషించువాఁడు ప్రభువులపట్లఁ జిత్తము గుఱుతింపక, నమ్మకము నొందక, స్వైరవిహారముగ సంచరింప

రాదు'. అని స్వకర్మానుభవమునుగూర్చి తలపోయుచు నెట్టెట్టులో యసువులు నిలఁబెట్టుకొనెను.

ఇఁక యోగనందుఁడు శకటాలుని వృత్తాంతమే మఱచి పోయి, రాజ్యమున బద్ధశ్రద్ధ వహించి, రాజులకుఁ దగ్గ వస్త్రాభరణాదులను దాల్చుచుఁ సేవలరజోగుణాభిభూతుఁ డయి పంచేంద్రియములకు లొంగి పార్థివభోగము లనుభవించు చుండెను. అట వ్యాడి గురుదక్షిణ మొసంగి తపశ్చరణమున కయి వనమున కేఁగఁ దలంచి యోగనందుని యొద్ద కరుదెంచి తనయాశయ మెఱింగించె. ఱేఁడును బూర్వవృత్తాంతంబు స్మరియించి, మిత్రమా, నీవు సయిత మీరాష్ట్రమున వసించి సర్వభోగము లనుభవింపు మని యాతనితోఁ బలికెను. అంత, నందశరీరమును జొచ్చిన యింద్రదత్తుఁడు విషయ విషాస్వాద ముగ్ధుఁడయ్యె నని వ్యాడి యెఱింగి ద్విగుణీకృతవైరాగ్యుఁ డయి 'మిత్రమా, యిట్టి నిస్సారములగు విషయములందు బుద్ధిమంతుఁ డెవఁడు చొఱఁబడును? మరుమరీచిక యగు లక్ష్మి ప్రాజ్ఞుని మోహపెట్టఁ జాలదు గదా!' యని బోధించి తన త్రోవను దాను తపోవనమున కరిగెను.

సాచివ్యభారమును బూనిన వరరుచి కొంతకాలము సకుఁ జతురంగబలసమన్వితుఁ డయి పార్థివునితోఁ గూడఁ బాటలీపుత్త్రమున కరిగెను. అట దైవానుగ్రహమున మహైశ్వర్యము లంది, యనారాధిత ప్రసన్నయు నశరీరిణియు నగు సరస్వతి రాష్ట్రకార్యము లుపదేశించుచుండఁ దల్లియు గురువులు మన్నించుచుండ—పతిదైవత యగు ధర్మపత్ని పరిచర్యలు సలుపుచుండ సక్తచిత్తుఁడు కాకయే సౌఖ్యము లనుభవించుచుఁ బెక్కేండ్లు కడపెను.

ఇటు, యోగనందుఁ డమాత్యశేఖరునియెడ రాజ్యభార మునిచి విత్తమదమత్తుఁ డయి, యింద్రియ వశ్యుఁ డయి రేయుం బవలు నంతిపురియందె వసియించుచు మూఢుఁడగు తన్నుఁ దా నెఱుంగఁ డయ్యెను. అట్టి మూర్ఖుఁ డగు నాతనిని వరరుచి చూచి నిర్విణ్ణుఁడయి యిట్లు తల పోసెను.—'ఔరా! కాల మెట్టి మార్పు తెచ్చినది? సర్వ శాస్త్రపారంగతుఁడై ప్రతిభ కలిగి శమదమాదిగుణముల కిక్కయగు నింద్రదత్తుఁ డెక్కడ? ఉపభోగములం దిచ్ఛకలిగి

వివేకము రవ్వంతయు లేక మత్తేభమువోలెఁ బ్రవర్తించు యోగనందుఁ డెక్కడ? ఈతఁ డాకస్మికముగ వచ్చిపడిన సిరివలన మన్నుమిన్నుగానక చరించుచున్నవాఁడు. ఈతని రాచ పనులకై యెంతయు శ్రద్ధపడు నాకు స్వధర్మము సన్నగిల్లు చున్నది. కావున సంధకూప మందున్న శకటాలుని దీయించి యాతనిని రాజకార్యములందుఁ బ్రవేశపెట్టెద.' అని నిశ్చయించు కొని ఱేనికి విన్నవించి యట్లులే శకటాలుని వెలుపలికిఁ దీయించి యమాత్యపదవియందు నియోగించెను. ఆతఁడును, 'వరరుచి యుండ యోగనందుని జయించుట దుస్సాధ' మని యెఱింగి, రంధ్రాన్వేషియయి రాజ్యకార్యములను యథాపూర్వముగఁ జూచుచుండెను.

## రాక్షసవశీకరణము

ఒకప్పుడు నరపతియానతిని రాత్రములందు నగరమును రక్షింపవలసిన రక్షకభటాధిపతు లొక్కొక్కరు రాత్రములందుం దిరుగుచుం జనిపోవం జొచ్చిరి. అది విని నందుం డాయుద్యోగ మందు వరరుచినే నియోగించెను. ఆతఁడును రాజునానతి మీఱక నిశీథమునం దిరుగుచు నొక్కయెడ నభిముఖముగా విచ్చేసిన రాక్షసు నొకనిం గాంచెను. కాంచి నీకేమి కావలయు నని పృచ్ఛించెను. ఆరక్కసియు, నీనగరమున నెవ్వతె యందగత్తె చెప్పుమా యని ప్రశ్న వైచెను. అద్దానికి వరరుచి నవ్వి 'మూర్ఖుఁడా, తాను వలచినదే రంభ. ఎవ్వని కెవ్వతె యిష్టమో యాతని కావెయే యందగత్తె' యని పలికెను. అంత రాక్షసుఁడు సంతసించి, 'యోయీ యోడితివి; నేఁటినుండి నీవు మిత్త్రుఁడ వయితివి; ఇఁక నీవు స్మరించిన మాత్రాన నెచ్చటనైన నెట్టి తఱినైనం బ్రత్యక్ష మయ్యెద' నని వచించి యంతర్ధానమందెను.

ఈతీరుగ వరరుచి యెల్లయపుడు రాజకార్యము లందు సహాస్రాక్షుఁడై సంచరించుచుండెను. ఒకనాఁడు వేకువను యోగనందుఁ డంతిపురియందుండి, గవాక్షమునుండి యొక విప్రుని వంక తొంగిచూచెడి తన రాణినిం గాంచెను. తోడనే యీర్ష్య పెనఁగొనఁ గలుషిత స్వాంతుఁడయి క్రుద్ధుఁడయి విప్రుని వధింపుఁ డని సేవకుల కానతి యొసంగె. దేని యానతిని సేవకు లాద్విజుని వధ్యభూమికిఁ గొంపోవుచుండ మధ్యేమార్గమునఁ జచ్చియున్న యొక మత్స్యము బిగ్గఅగా నవ్వెను.

అది యెఱింగి నరపతి విప్రుని వధను నిషేధించి మత్స్యహాసమునకుఁ గారణమేమో నిరూపించి చెప్పుమా యని వరరుచి కాజ్ఞ యొసఁగెను. ఆతఁడును సరస్వతిని స్మరింప నామె ప్రత్యక్షమయి 'వత్సా, యీరేయి యీబాలవృక్షము క్రింద నొరులెఱుంగకుండ దాఁగియుండుము; మత్స్య మెందులకు నవ్వెనో కార

ణ మెఱింగెదవ'ని పలికెను. అట్టులె యాతఁడా రేయి చెట్టుదరిఁ జేరియుండఁ బెనురక్కసి యొక్కతె తనపిల్లలతో నక్కడకు వసింపఁ జనుదెంచెను. అంతఁ దిండికై దేవురించెడి పిల్లలను దల్లి శిరమున నిమిరి 'రేపు మీకు విప్రమాంసము తెత్తును; ఆతని నేఁడు చంపియుండలేదు', అని యూఱడించుచుండెను.

పిల్లలు—ఆతని నేఁడెందులకుఁ జంపలేదు?

తల్లి—వధ్యభూమి కాతనిఁ గొంపోవుచుండఁ జచ్చిన మత్స్య మొకటి నవ్వెను.

పిల్లలు—ఎందులకు నవ్వెను?

తల్లి—బిడ్డలారా, యంతిపురిని రాజాంగన లెల్లరు భ్రష్టచరిత్ర లయ్యిరి. స్త్రీవేషధారులగు పురుషులు పెక్కు రంతిపురి యం దెల్లయెడల గూఢముగ సంచరించుచున్నారు. ఇది యెఱుఁగక జాల్ముఁడగు ఱేఁడు నిరపరాధుఁడగు విప్రునిఁ జంపించుచున్న వాఁడని మత్స్యము నవ్వెను.

ఈసంభాషణము వరరుచి యెఱింగి మఱునాఁటి రేపకడ ఱేనికిఁ జెప్పెను. అతఁడును స్త్రీవేషధారులగు పురుషుల నెల్లర వెదకించి వధింపించెను.

చేఁడితీరుగ నుచ్ఛృంఖలప్రవర్తనము సాగింపుచుండెను. ఆతని సేవయన్న వరరుచికి నీచముగ నుండెను. ఇటులుండ నొకప్పు డొకచిత్రకారుఁడు సమర్థుఁడగు వాఁడాస్థానమంట పమున కరుదెంచి యోగనందునియు మహాదేవియుఁ బ్రతి కృతిని జిత్రించెను. అంత యోగనందుఁడు సంతసించి యాత నికి హెచ్చుగఁ బసదన మిచ్చి పంపెను. పిదప వరరుచి యొకనాఁడు రాణిం గాంచందలంచి, యభ్యంతరము చొచ్చి యొక్కయెడ నాచిత్రపటమును విలోకించి, మహాదేవి చిత్రమందలి లక్షణమొండు లేకుండుట యూహించి యామె మేఖలాపదమునఁ దిలకమొక్కటి కుంచెతో నేర్పఱచెను. మఱునాఁడాతిలకమును యోగనందుఁడు గుఱుతించి వరరుచియే దాని నుంచెనని యెంచి ప్రముగ్ధుఁడయి యిటులు నిశ్చయించు కొనెను— 'ఔరా, వరరుచి నిశ్చయముగఁ జరిత్రభ్రష్టుఁడే; ఈతఁ డంతఃపురవిప్లవ మొనర్చుచున్నవాఁడు. కావుననే యీతఁడు స్త్రీవేషధారులగు పురుషులను గుఱుతించినాఁడు.' అని కోపమున మండిపడుచు 'వరరుచి దుర్మార్గగామి గాన నాతని వెనువెంటనే చంపివేయింపు' మని శకటాలున కానతి

యొసంగెను. మహామతి యగు శకటాలుఁడును, 'వరరుచి బుద్ధిప్రభావ మమేయము; ఆపదనుండి యితఁడే నన్నుద్ధరించి నాఁడు. సురాసురులు సయిత మీతని సమయింపఁజాలరు; మనుజులమాట సెప్పవలయునా!' యని చింతించి, వరరుచిని దనయింట గూఢముగా దాఁచియుంచి మీయాజ్ఞ నిర్వర్తించితి నని జేనితోఁ జెప్పెను.

ససేమిరా కథ

యోగనందునకుఁ బదునెనిమిదేండ్ల ప్రాయము గల కుమారుఁ డొకఁ డుండెను. అతనిపేరు హిరణ్యగుప్తుఁడు. అతఁడొకనాఁడు మాతాపితలు వలదన్నను మిత్త్రులు మందలించినను లెక్కగొనక, మృగయాక్షిప్తచిత్తుఁడయి వారువము నెక్కి కొందఱాప్తులు తోడరుగుదేఱ మహావనము చొచ్చెను. అట వనవరాహ మొండు కన్పట్ట దానిని వెంబడించి పోవుచు గుఱ్ఱమే తోడుగా నొంటిఁ జిక్కి సుదూర మరిగెను. ప్రొద్దు గ్రుంకెను. చిమ్మచీఁకటి యెల్లయెడలఁ గ్రమ్మెను. అడవి మెకముల గర్జన భర్జనముల నాలకించి మిక్కిలియు విభీతుఁడయి రాజపుత్త్రుఁడు మహావృక్ష మొక్కటి యెక్కెను.

అంతలో నాకుణాంబ సింగం బొండు పిఱుందఁబడి తఱుముచుండఁ దన్నుఁ దా రక్షించుకోఁ దలంచి యొక్క యెలుఁగు బంటి వృక్షమునె త్వరితముగఁ బ్రాకెను. దానిం జూచి యత్యంతము భీతివడి కంపితగాత్రుఁడై యున్న హిరణ్యగుప్తుని

దరిఁ జేరి యెలుఁ గిట్టు లనునయించెను— 'మిత్త్రమా, భయ పడఁబోకుము; నన్ను నీవు శరణుచొచ్చినట్టులు తలంతు. నీ కేమియు చెఱుపు సేయను.' నావిని యాతఁడును నమ్మి వేఁట బడలికవలన నెలుఁగుబంటి యొడియందుఁ బరుండి నిద్రించు చుండెను.

అంత సింగం బా యెలుఁగుతో నిట్టులనియె— 'భల్లూకమా, వీఁడు మానవుఁడు; ఇతఁడు మనజాతిని బరిమార్చుటకే యిచ్చ టికి విచ్చేసినాఁడు. కాన నితఁడు మనకు నిత్యవైరి. అట్టివాని నట్టు లొడియం దుంచుకొంటివేల? తుదకు నీకాతఁ డపకారమే యొనర్చునే? నామాట మన్నించి యీతనిం గ్రిందికిం ద్రోయు ము. నాకడుపు పని నేను చూచుకొందును. ఆవల నీదారిని నీవు పొమ్ము.' అన విని యెలుంగు శరణాగతుని కపకృతి యొన ర్చుట సంభావ్యము కాదని పలికి వానిం గ్రిందికిఁ ద్రోయుట కొడంబడదయ్యెను. ఇంతలో రాజపుత్త్రుఁడు మేలుకొనుడు భల్లూక మాతనితో 'ఓయీ, నేనును నిద్రింతును; పరాకులేక చూచుచుండుమ'ని పలికి యట్టులె నిద్రించుచుండెను. అంత

సింగం బాతనిం జూచి 'యోయీ, నీవు పిచ్చివాఁడవు సుమా! ఇంతలో దీని నమ్మితివే! ఇది చపలచిత్తయని యెఱుంగ వేమో! నిన్నిపుడు నావలననుండి కాపాడి తుదకుఁ దానే భక్షింపఁ జూచుచున్నది. జంకక దీనిం గ్రిందికిఁ ద్రోయుము. దీనిని నేను భుజించి నాదారిని బోదు. నీవును నీ యూరి కరుగుము'ని పలికి యాస పెట్టెను. దాని విని యానీచుఁ డద్దానిని వెన్వెంటనె క్రిందికి నెట్టెను. ఎలుఁగు మాత్ర మెట్టెటో క్రిందికొమ్మను బట్టుకొని యట్టె నిలఁబడి యుండెను. తోడనె యాతఁడు గడగడ వణఁకసాగెను. అంత నెలుంగు— 'ఓయీ, పాపిష్ఠుఁడా, వణఁకెదవేల? పూర్వజన్మకర్మమనుభ వింపక తీఱదుగదా! కాన 'ససేమిరా' యని వదరుచు పిశాచ భూతుఁడవై యీయడవియం దెల్లయెడలఁ ద్రిమ్మరుచు నిట్టిపని బట్టబయలగు నంతదాఁక నట్లే యుండుమని శపించి తన త్రోవను బోయెను. సింగమును విసుగెత్తి యెచ్చటికో పోయెను.

ఎలుంగు పలికినట్టులె హిరణ్యగుప్తుఁ డచ్చటచ్చటఁ దిరుగాడుచుండెను. ఆతని తురంగము నగరమున కరిగినది. రాకొమరుఁడు లేని తురగ మేతెంచెనని పౌరు లచ్చెరువడి

యోగనందున కత్తెటం గెటింగించిరి. ఆతఁడును బెల్లుగ దురపిల్లి యమాత్యులను రావించి, 'మంత్రులారా, కుమారుఁడు వేఁట కరుగునపుడు గొప్ప దుర్నిమిత్తము లేర్పడినవి. అట్లయ్యు మామాట మన్నింపక యాతఁడు మత్తుఁడయి యడవి కేఁగినాఁడు. దానికి ఫలము తత్క్షణము చూపట్టినది. ఆతఁ డెక్కిపోయిన వారువ మొక్కటియు విచ్చేసినది. కాన వాని వెదకుటకయి యడవులకుఁ బోదమ'ని వచించెను. వారును వల్లె యనిరి. అంత నందుఁడును గుమారుఁ డరిగిన త్రోవను గాఁ అడవి చేరిరి. ఎల్లయెడలఁ దడవి తడవి చూచిరి. ఒక్కయెడ దిక్కుమాలి దీనదశ నంది ససేమిరా యని పలుకుచుఁ బిశాచమయి హిరణ్యగుప్తుఁడు కానుపించె. యోగనందుఁడు నందనునిఁ గాంచి శోకసాగరమున మునిఁగెను. ఎట్టులో యందఱాతనిని నగరము చేర్చిరి.

అట నాతఁడు కుమారుని యున్మాదము మాన్పుటకయి పెక్కు విధులను గావింపించెను. ఎన్నో దానమ్ములు భూతబలివిధానమ్ములు నాచరించెను. ఏమిటను స్వస్థుండు

కాఁడయ్యె. అంతట తేఁడు విషణ్ణుఁడయి యందఱి యెదుటఁ దన్నిట్టులు నిందించుకొనియె — 'ఔరా, యెంతపని యొనర్చితిని; ఇప్పుడుగాని వరరుచి యుండెనా యున్మాదహేతు వొక్క నిముసములో గుఱుతించునే! అతని వ్యర్థముగాఁ జంపించితినే! ఛీ పాపిష్ఠుఁడను.' నికటవర్తియగు శకటాలుఁడు దానిని విని వరరుచిని బయటపెట్టఁ దగ్గ యమూల్య తరుణ మేతెంచెనని తలంచి, జేనినుండి యభయము గైకొని, 'రాజా, మహామతి యగు వరరుచి నాయింటనె బ్రతికి యున్నాఁడ'ని వచించెను. యోగనందుఁ డానందపడి తోడనె తోడ్కొని రమ్మని యాదేశించెను. వాని యానతిని శకటాలుఁడు వరరుచిని జేని యొద్దకుఁ దీసికొని వచ్చెను.

అంత వరరుచి, యున్మత్తుఁడగు రాకొమరునిఁ జూచి రాజకుమారా, యని పిలిచెను. ఆతఁడట్టులె ససేమిరా యంచుఁ బలుకుచుండెను. అంతట వరరుచి రాజపుత్త్రి నుద్దేశించి యీపద్యము పఠించెను.

"తే. సకల లోకోపకార సంచారులైన
సాధుజనుల వంచించుట జాణతనమె!

తొడలపై నమ్మి నిద్ర వోయెడు వయస్యుఁ
బగతు పాలను ద్రోయఁ బాపంబు గాదె?"

దాని విని రాకొమరుఁడు నాల్గింటఁ దొలియక్షరము వీడి 'సేమిరా' యని పలుక సాగెను తిఱుగ వరరుచి యిట్లు చదివెను—

"కం. సేతువు దర్శింప మహా
పాతకములుఁ బాసిపోవుఁ, బ్రాణసఖునకున్
ఘాతుక మతి నొనరించిన
పాతక మేతీర్థసేవఁ బాయును నరునిన్.'

ఇది విని యక్షరములు రెండు విడచి 'మిరా' యని పలుకుచుండెను. అంత వరరుచి మఱల నిట్లు చదివెను—

"కం. మిత్త్రద్రోహి కృతఘ్నుఁడు
ధాత్రీసురహంత హేమతస్కరుఁడు సురా
పాత్రీభూతుఁడు నిందా
పాత్రులు వీరెల్ల నరకభవనావాసుల్.'

దీని విని మూఁడక్షరములు విడిచి 'రా' యనుచుండెను. తుదకు వరరుచి నాలవది యిట్లు చదివెను.

'కం. రాజులు మెచ్చఁగ దిక్కుల
రాజులను జయించి ధనము రాజులచేతన్
ఓజఁ గొని విప్రకోటిం
బూజింపు మనూనదాన భోజనవిధులన్.'

అంత నిది యంతయు విని హిరణ్యగుప్తుఁడు స్వస్థచిత్తుఁడు సావధానుఁడు నయి నిర్జనారణ్యమున జరిగిన భల్లూకవృత్తాంత మంతయుఁ జక్కఁగ వినిపించెను.

అది విని యోగనందుఁడు మిక్కిలియు నబ్బుర మంది వరరుచి వంకఁ దిరిగి 'ఔరా! నీకియ్యది యెట్టులు తెలిసెనో!' యని పృచ్ఛించెను. అంత వరరుచి, 'దేవ, ధీమంతులు లక్షణములను బట్టియు, ప్రతిభ చూపియు, నూహలు సేసియు నొరు లెఱింగింపని యుదంతము సయితము గుఱుతింతురు. దానం జేసియే యేను మున్ను పటమందలి తిలకమును గుఱు

తించితిని గదా' యని ప్రత్యుత్తర మొసఁగెను. వెంటనె, మహాశ్చర్యభరితమానసుఁడు ననుతాపతప్తుఁడు నగు యోగనందునివలన వరరుచి, సత్కారము లందకయే, యిప్పటికైనను ధన్యుఁడ నయితిని గదా యని తలఁచుచు, విరక్తుఁడయి నశ్వరముకన్న నశ్వరమగు రాజానుగ్రహ మిఁకఁ జాలుఁజాలునని నిరసించి తనయింటి కేఁగెను.

అట నాకస్మికముగ నరుదెంచిన యల్లునిం జూచి యుపవర్షుఁడు సముద్భ్రాంతమనస్కుఁడయి యిట్టు లనియె—'ఓయీ, నాఁడు నీవధదండమును విన్నదై, పతిదేవత యగు నాదు దుహిత శోకదగ్ధయై కంటికి మంటికి నేకధార లొలుకు చుండ మేమందఱము వలదన్నను జిచ్చుఱికెను. జరాజర్జరిత దేహయగు నీజనని 'హా! *కాత్యాయన హా! వరరుచి! హా! సకృచ్ఛ్రుతధర!' యని యనారతము విలపించుచు హృదయము తనంత విచ్చిపోవ దివి కేఁగెను.' అని పలికి బావురుమని యేడ్చెను.

ఇది యంతయు వరరుచి యాలకించి, యభినవోద్భూత శోకవేగమున దగ్ధహృదయుఁడయి, మొదలు తెగిన మ్రాను వోలె నేలయందుఁ బడి యెంతయు విలపించెను. ప్రియబంధు నాశనమునఁ జేసి యేరుపడిన శోకవహ్ని యెవ్వనిని దపింపఁ జేయదు?

---

* వరరుచికి నామాంతరము.

పిదప నట్టి విషాదావస్థ యందున్న వరరుచియొద్దకు వర్షో పాధ్యాయుఁ డరుదెంచి యిట్టులు బోధింప సాగెను — 'వత్స, సకృచ్ఛ్రుతధర, యిదేమోయి? ప్రాకృతునిమాడ్కి, ననధిగతధర్మసూత్రుని భంగి, నవిద్వాంసుని పగిది, ననిరూపితలోక వృత్తాంతుని రీతి విషాదవశమైన యాత్మను వశపఱచుకొన వయితివి. నిశ్చయముగ నీవు పుట్టిననాఁటఁగోలె శోకరస మాస్వాదించి యెఱుంగవు. నీదు వైరాగ్యమును స్థిరపఱచుటకే నీవారాధించు దైవ మిట్టు లొనర్చినది. ధైర్యము పూనుము. లోకతత్వమును గుఱుతింపుము. ఈ జగమున-ఆసంసారము నిత్యమై వెలయునది యనిత్యత యన్నది యొక్కటియే. అట్టి యీశ్వరకృతమగు మాయ నెఱింగియు నిట్లేల మోహమందెదవు?'

ఈతీరుగఁ బ్రబోధితుండయి వరరుచి విషాదమును విడనాడి విరక్తహృదయుఁడయి పరిత్యక్తసర్వనిబంధనుఁడయి ప్రశమైకసహాయుఁడయి తపోవనమున కరిగెను.

# ప్రతిక్రియ

అటఁ బెక్కుదినములు గడచినవి. ఒకప్పుడు వర
రుచి మగధదేశమునుండి యాదృచ్ఛికముగ నరుదెంచిన విప్రు
నొక్కనిగూర్చి యోగనందుని వార్త లేమని ప్రశ్నించెను.
ఆతఁడీతని గుఱుతించి యభివందన మాచరించి యిట్లు వచించె.
'మహామతీ, తాము తపోవనమున కరిగితిరి. నాఁటనుండి కృత
వైరుఁడగు శకటాలుఁడు లబ్ధావకాశుఁడయి యోగనందుని
వధింప వలయునని యుపాయము లూహించుచుండెను. ఇటు
లుండ నొకప్పు డొక్కయెడ నాతఁడు భూమినిఁ ద్రవ్వుచుఁ
గూరుచున్న భూసురు నొక్కనిఁ జాణక్యుఁ డనువానిని జూచెను.
చూచి యెందుల కిటులు త్రవ్వుచుంటి వని పృచ్ఛించెను. ఆతఁ
డును వెంటనె, యీదర్భ నాపాదములకు గ్రుచ్చుకొన్నది;
కాన నేదీనిని బెకలింపక యావలకుఁ బోవనని ప్రత్యుత్తరించెను.
అంత, నిట్టి క్రూరనిశ్చయుఁడగు నీతఁడు నాకండగా నున్నచో నా
మనోరథములు పండినట్టులే గదా యని శకటాలుఁడు దృఢపఱచి

కొని, యాతని సమ్మానించి తనయింటనె వసియింపఁ జేయుచుం డెను. ఒకప్పుడు యోగనందుని యింట సువర్ణలక్షదక్షిణలుగల త్రయోదశీశ్రాద్ధ మొండు జరుగుచుండ నందు శకటాలుఁడు చాణక్యునే నిమంత్రితులలో ముఖ్యునిగా నొసర్చెను. కాని, యా స్థానమునే తేనికి విశ్వాస్యుఁడగు సుబంధు వనెడి విప్రుఁడొకం డును గాంక్షించి యుండెను. అంత యోగనందుఁడు, పూర్వ నియుక్తుఁడయి యున్నను జాణక్యుని నగ్రాసనమునుండి తొలఁ గించె.

అంతటఁ జాణక్యుఁడు కోపమున మండిపడుచు సిగను విడఁదీసి— 'యేడునాళ్లలో నీదుర్వినీతుఁడు నైశ్వర్యమత్తుఁడు నగు తేనిని బరిమార్చి జుట్టు ముడివైచెద' నని ప్రతిజ్ఞ యొనర్చె. నాఁటి నుండి శకటాలుఁడు చాణక్యునిఁ దనయింటనె గూఢ ముగ దాఁచియుంచి, యాతఁడు కోరిన యెల్లవస్తువు లడిగినదే తడవుగ నొసఁగుచుండెను. అతికోపనుఁడగు నాబ్రాహ్మణుఁ డుగ్రములగు నథర్వమంత్రముల నుచ్చరించుచు తేనినుద్దేశించి చేతఁబడి యొనర్చెను. అద్దాన యోగనందుఁడు తీవ్రదాహ

జ్వరదగ్ధుఁడయి యేడవనాఁటఁ బంచత్వ మందెను. శకటాలుఁడును దత్క్షణము, హిరణ్యగుప్తునిఁ బరిమార్చి పూర్వనందుని పుత్త్రుఁడగు చంద్రగుప్తుని రాజ్యమం దభిషేకించి చాణక్యుని సచివపదవియం దేర్పఱచి, ప్రతిక్రియ కావించి, పుత్త్రశోకమున నిర్విణ్ణుఁడయి వనమున కేఁగెను.'

## దేహమోక్షము

ఇట్టు లతిశోచనీయమగు యోగనందుని యుదంతమును వరరుచి యాలకించి మిక్కిలియు ఖిన్నుఁడయి సంసారమసారంబని యెఱింగి, వింధ్యవాసిని యను రాక్షసి నుపాసించి యాపె యానతిని, వ్యాఘ్రవానరసంకీర్ణ మయి దురవగాహముగఁ దోఁచు వింధ్యాటవియందుఁ దిరుగాడుచు నొక్కెడ నొక గొప్ప న్యగ్రోధతరువును గాంచెను. అయ్యెడ వందల కొలఁది పిశాచములు చుట్టుపెట్టికొని కాణభూతి యను భేతాళుండు కానుపించె. తోడనె వరరుచి పూర్వజన్మవృత్తాంతము నెఱింగి, యా కాణభూతి పుష్పదంతుఁడను పేరుగల తన నెచ్చెలి యనియు; సుప్రతీకుఁడను పేరు గల యాతఁడు కుబేరుని శాపమునఁ జేసి పిశాచీభూతుఁ డయ్యెననియు గుఱుతించెను. గుఱుతించి సౌహార్దము నెఱపి యాతనికి విద్యాధరచరిత్రము లెస్సఁగ వర్ణించి చెప్పి యిటులు బోధించెను—'మిత్త్రుఁడా, యచిరకాలమందె యిటకు విచ్చేయ నున్న గుణాఢ్యున కీయపూర్వమగు కథను జెప్పుము. అద్దాన శాపవిముక్తుఁడ వయ్యెదవు.'

అని తాను దేహమోక్షమునకయి పుణ్యప్రదమగు బదరికాశ్రమమునకుఁ బయనమయ్యె.

మధ్యేమార్గమున హిమాలయోపాంత వనములం దొక్కయెడ నాతఁడు, కందమూలఫలాదులతోఁ గాలము గడపుచున్న శాకరసుఁడను తపస్వి నొకనిఁ గాంచెను. ఆతఁ డత్యాదరమున నతిథిసత్కారము లొనర్ప నందుకొని, యాతనికి మోక్షరహస్య ముపదేశించి పిదప బదర్యాశ్రమముఁ జేరెను.

అట నిరాహారుఁడయి — నిరంతరభక్తిభరితుఁడయి నిర్గతజీవితాభిమానుఁడయి — నితాంతనియమశోషితకరణగ్రాముఁడయి — నిరహంకృతియయి; భవానీచరణకమలముల నుపాసించుచు, నుగ్రమగు తపశ్చరణమున నుమాదేవిని దుష్టి పఱచుచు, భవానీపతి యభినందింప దివ్యపథంబున కేఁగెను.

ది ఓరియంటల్ ప్రెస్, తెనాలి.

# వెలకు సిద్ధములగు గ్రంథములు

## ౧ వైదిక వాఙ్మయ చరిత్రము

ఇది వేదములను, బ్రాహ్మణములను, ఆరణ్యములను, ఉపనిషత్తులను, సూత్రగ్రంథములను గూర్చి విమర్శించిన గొప్ప గ్రంథము. మహోన్నత దశలో నున్న ఆనాటి భారతీయుల విజ్ఞానప్రాభవము పాశ్చాత్యులు కొండాడినతీరు ఇందు తెల్లమగును. విద్వచ్ఛిరోమణి కక్ష్యలకుఁ బాఠ్యగ్రంథముగా నుపకరించునది. లైబ్రరీబుక్కుగా 'అప్రూవ్' కాఁబడినది. తొమ్మిది అధ్యాయములు. దరిదాపు ఐదువందల పుటలు.

వెల రెండున్నర మాత్రము.

## ౨ కామశాస్త్రము

ఇది - తృతీయపురుషార్థమును గూరిచి సర్వతోముఖముగఁ జర్చించిన వాత్స్యాయన సూత్రములకుఁ దేటతెల్లమగు తెలుఁగుసేఁత. వాత్స్యాయనసూత్రములు, జర్మని - హింది - బెంగాలి - ఇంగ్లీషు మున్నగు భాషలలోఁ బరివర్తింపఁబడి వేలకువేలు ప్రతులు ప్రపంచవ్యాప్త మగుటయే దీని యౌత్కృష్ట్యమును సూచించుచున్నది. కామశబ్దశ్రవణమాత్రానఁ గలవరపడని యోగ్యులగు పాఠకులకు మాత్రమే యియ్యది పఠింపఁదగియున్నది. ఆపాతతః చదివి ఆవలఁ బెట్టవలసినతీరులో - ఇయ్యది నిబద్ధము కాలేదు. ఏడు అధ్యాయములు. ముచ్చట నిచ్చు నచ్చు. శైలి లలితము. విషయము అమూల్యము.

వెల ఒక్క రూపాయి.

## 3 ధర్మశాస్త్రము

సర్వవిధములగు విధులు సమగ్రముగఁ జర్చింపఁబడ్డ ప్రామాణికమగు ప్రాచీనస్మృతి. మను మహర్షిప్రోక్తమగు నిందలి విషయములను ఖండనమునకైన, మండనమునకైన అతురాస్య లగువారెల్లరు నధ్యయనము సేయఁదగును. అస్పృశ్యత - ఆహారాది విషయములందు కలవరపాటు చెందిన అధునాతన లోకము ముఖ్యముగఁ గాంచఁదగును. ఆదర్శభూతులగు అర్వాచీనుల యభిప్రాయములను ఆధారముగాఁ గొని అభివర్ణించిన విపులమగు పీఠిక కలదు. సర్వాంగ సుందరమగు ముద్రణావిధానము.

వెల రెండు రూపాయలు.

## ౪ సతీ సప్తతి

ఉచితమగురీతిని హృద్యములగు ఉపదేశములను ఉపదేశించిన గ్రంథము. పద్యములు సరసములు. విశిష్య - బాలికల కత్యంతోపయుక్తము. 'టెక్స్టు బుక్కు' గా 'అప్రూవ్' అయినది.

వెల రెండణాలు.

## ౫ కథా వింశతి

ఇరువది కథలు. నీతి - లోకతంత్రము - విద్యాభిలాషము - వినయప్రవర్తనము లోనగు సుగుణములను సులభముగ బోధపఱుపఁజాలు కథలు. ప్రారంభవిద్యాభిలాషులకు అత్యంతము ఉపకరించునది. 'టెక్స్టు బుక్కు'గా, అప్రూవ్ అయినది.

వెల అయిదణాలు.

౬ సుభాషితము

సంస్కృతవాఙ్మయ మహోదధినుండి యేర్చికూర్చిన నీతిరత్నములు. సర్వకాలము సర్వమానవు లాదరింప ననువగు నీతివాక్యములెయిందుఁ గలవు. సరసమగు వచనరచన. 'లైబ్రరీ బుక్కు'గా అప్రూవ్ అయినది.

వెల నాలుగణాలు.

౭ కావ్యమాల

(రెండు భాగములు)

ప్రాచీనార్వాచీనములగు నాంధ్రగ్రంథములనుండి యేర్చి, కూర్చిన సరసములగు గద్యపద్యముల సంపుటి. 'టెక్స్టు బుక్కు' గా 'అప్రూవ్' అయినది.

ఒక్కొక్కటియు పండ్రెండణాలు.

౮ కవుల కథలు

కవిత్వప్రతిష్ఠ-చరిత్రప్రసిద్ధత నంది కలకాలము ఆంధ్రులు నోట పాటగా పాడుకొనఁదగ్గ కవిసార్వభౌముల చరిత్రాత్మక కథలు.

'టెక్స్టుబుక్కు-గా' అప్రూవ్ అయినది.

వెల అయిదణాలు.

వలయువారు:—

మేనేజరు,

భాషాపోషక గ్రంథమండలి.

అమృతలూరు. గుంటూరు జిల్లా.

